రంగ—లేకపోతే ఏమిటిదంతా? ఈ వెంట్రుకలూ, యీ రిబ్బను ముక్కలూ, ఎండిపోయిన మల్లెపూలు!

రామం—(టేబుల్ మీద వెతికి) ఇదిగో కుంకం! (అని అది పొట్లం కట్టిదాస్తారు)

రంగ—పోనీ వెతికితే వెతికావ్! ఏమన్నా దొరకచ్చు, కాని అవి పొట్లంకట్టి దాస్తావెందుకూ?

రామం—(మరోకచోట Hair pin కనబడగా తీసి) ఇదిగో విరిగిపోయిన hair pin

రంగ—నామాటవిని, అట్లా Main road న Railway platform దాకా వెళ్ళిరా. ఎందుకన్నా పనికొచ్చే వస్తువులు దొరుకుతయ్.

రామం—అయితే నీవు ద్దేశ్యంలో ఇవ్వేందుకూ పనికిరానివనా?

రంగ—పనికొస్తయ్యంటావేం - ఖర్మం!!

రామం—కాస బుర్ర వుపయోగిస్తే, చాలా బాగా పనికొస్తయ్!

రంగ—ఆబుర్రేవుంటే నీతో ఎందుకు స్నేహంచేస్తాను.

రామం—ఈ చిన్న చిన్న 5,6 వస్తువులు మనకొకగ్రంథం, ఒక జీవిత చరిత్ర చెబుతాయ్.

రంగ—ఏడిశాయ్! ఊరికేవాగకు నో త్తపూరుకూడాను. పిచ్చివాడిక్రింద లెక్క కట్టెయ్యగలరు.

రామం—లాభంలేకురా! నీకు చెప్పినా, లాభంలేదు.

రంగ—ఇందులో లాభం నకటా!

రామం—అసలు నిన్ను పుట్టించిన ఆ భగవంతుడిది తప్పు. నిన్ననేం ప్రయోజనంలేదు.

రంగ—ఏం? ఏం తప్పుచేశాడు?

రామం—అందరికీ బుర్రనిండా పెట్టిన మెదడు రెండు భాగాలుగా పెట్టాడు ఇటొకభాగం - అటొకభాగం. నీకు ఒకవైపే పెట్టి వూరుకున్నాడు. రెండోవైపేం లేదు. కాబట్టి నీకు యివతలవాడేమంటున్నదీ చచ్చినా బుర్రకెక్కదు.

రంగ—ఏడిశావ్!

రామం—వాదనలో అవతలవాడనేది చస్తేవినవ్. విన్నా-అర్థం చేసుకోవ్.

రంగ—ఏడిశావ్ లేవోయ్! నీలెక్కప్రకారమయితే ప్రపంచంలో సగం మనుష్యులకి మందికి రెండోవైపు మెదడు ఉండి వుండదు, ఒళ్ళునాకేమిటి?

రామం—ఇప్పుడీ రిబ్బన్ముక్క, మల్లెపువ్వు, యీ శిరోజం యీకుంకుమ, తలపిన్ను - నాకు దివ్యమైన భోగట్టా యిచ్చాయ్.

రంగ—ఎందుకొచ్చిన భోగట్టా అంటూ?

రామం—అదే నీదగ్గర వున్నది. సుందరంగాడికోసం మనం యీవూరు వచ్చాం. వాడువూళ్ళో లేడు. వాడువచ్చేదాకా పనీపాటా లేకుండా యీవూళ్ళో యీ హోటల్లో గడపాలి. కనక, యీరెండురోజులూ యిటువంటి డిటెక్టివ్ పని పెట్టుకుంటే తేలిగ్గా వుఋసుపోదూ.

రంగ—నీ డెక్టివ్ పని ప్రారంభించావ్! ఎప్పట్నుంచీ

రామం—అదిగో, ఆనవల చదివిన దగ్గర్నుంచీ.

రంగ—(టేబుల్ మీద పుస్తకం చూపిస్తూ) ఇదా?

రామం—ఊఁ ఆదే. తగలేశాడు చివరకి. వాడిచ్చిన Clues తో, గుడ్డిముండకూడా కనుక్కుంటుంది. గొప్పగా వ్రాశాడు.

రంగ—వీటిల్లో ఏదన్నా గొప్పసంగతి, అప్పుడే కనిపెట్టేశా వేంరా—నాతో చెప్పకుండా?

రామం—నేకనిపెట్టేదేమిటి ఈ ముక్కలన్నీ వాటంతటవే చెబుతుంటే.

రంగ—యివన్నీ?—నీకెప్పుడు చెప్పాయిరా?

రామం—(నవ్వి) నేనేమో అనుకున్నాగాని—నీకావాక్క-వైపు మెదడుకూడా లేదురా.

రంగ—ఏడిశావ్ లే. ఒకవైపు తప్పకుండా వుండేవుంటుంది.

రామం—వీటినన్నిటినీ చూస్తుంటే అర్థం కావటంలే!

రంగ—నిజంగా అర్థంకాలే.

రామం—ఈ చిన్నచిన్న వస్తువుల నాధారం చేసుకుని మనం పెద్దభోగట్టా సంపాదించవచ్చు. పెద్దపెద్దహత్యలన్నీ చిన్న చిన్న యిలాంటి వస్తువులతోనే, చాలామంది కనిపెట్టారు. మొట్టమొదట ఈ మల్లెపువ్వూ, కుంకుమ, ఏంచెబుతాయంటే (రంగనాథాన్ని వకసారి చూచి) భయంలేదులే, గాబరాపడకు- ఈ గదిలో, యిక్కడ,

మనం రాకపూర్వం-ఒక స్త్రీ-వుండి వెళ్ళిందీ- అని చెబుతున్నయ్.

రంగ—నీ మొహంలావుంది హోటలు అన్నతర్వాత ఎవరో ఒకరు వుంటారు. మల్లెపూలు ఆడవాళ్ళే పెట్టుకుంటారు. దీంట్లో విశేషమేముంది ?

రామం—అదే తెలివంటే. ఈమల్లెపువ్వు ఏం చెబుతోందంటే ఆమె రాత్రంతా యిక్కడేవుందని చెబుతోంది.

రంగ—అదిచెబితే చెప్పిందికాని, కాస్త జ్ఞానముంటే నువ్వలా చెప్పక.

రామం—ఏం ?

రంగ—ఆడవాళ్ళు పగలూ పూలు పెట్టుకుంటారు.

రామం—(తన బుర్ర చూపిస్తూ) నీకిక్కడేమీ లేదు. ఖర్మం. ఆడవాళ్ళు పగలు పెట్టుకున్న పువ్వు క్రిందపడి వాడిపోతే వాడిపోవచ్చు. కాని, యిట్లా నలిగి అప్పచ్చి అయిపోదు.

రంగ—అవునురోయ్. ఇది పాయింటే.

రామం—కుంకం పెట్టుకుంది కాబట్టి పునిస్త్రీ అయివుండాలి!

రంగ—"అయివుండాలి" అని అంత ధీమాగా అంటావేమిటి ?

రామం—నువ్వు కాదంటావా ?

రంగ—అంటే, అంటాను.

రామం—ఎలా అనగలవ్! కుంకం పెట్టుకుంటే,

రంగ—పోరా చాలామంది వితంతువులూ కుంకం పెట్టుకుంటున్నారు.

రామం—నీ కేమని చెప్పారా?

రంగ—ఆమె పునిస్త్రీ అన్నావ్.

రామం—అంతకుముందు? నీకు రెండో సైడు లేదన్నానా?

రంగ—ఒకసారేం, చాలాసార్లన్నావ్.

రామం—ఆమాటనిజం, అతు-రాలానిజం. విధవైనా బొట్టు పెడితే పునిస్త్రీ అయిపోదూ?

రంగ—నిజమేరోయ్!

రామం—కాబట్టిఆస్త్రీక్రిందటిరాత్రంతాయీగదిలోనేఉంది.

రంగ—ఉందేమో!!

రామం—ఒప్పుకున్నావా?

రంగ—ఆ-రిబ్బన్ ముక్క-hair pin ఆమెవే.

రామం—yes ఇప్పుడిప్పుడే నీకాస్త తెలివి పుడుతోంది. సరే! ఇక యీ శిరోజం ఏం చెబుతోందయ్యా అంటే.

రంగ—నా ఎదు. అదేంచెబుతుంది, చెపితే నువ్వేచెప్పాలి.

రామం—(వెంట్రుక చేత్తోచూపిస్తూ) ఇది నల్లగావుంద కనుక, ఈస్త్రీ చాలాయావ్వనంలో వుందనీ, యీ వం కరలను బట్టి ఆమె చాలా అందమైనదనీ.

రంగ—ముసలివాళ్ళకు మాత్రం నల్లవెంట్రుకలుండవుట్రా?

రామం—(కసుగ్గా) ఒరేయ్! నువ్వువిను. వంకర ప్రశ్నలు వెయ్యకు.

రంగ—సరే.

రామం—సరే-ఇరవై లేక ముప్పై ఏళ్ళదయి ఉంటుందని తెలిసింది. ఇక యీరిబ్బను? ఎల్లా ఉందోచూడు.

రంగ—ఎల్లాఉందీ–చిరిగిందీ.

రామం—చిరిగింది. కత్తిరించలేను. ఈ hair pin?

రంగ—విరిగింది.

రామం—విరిగింది. మరి ఇంకేం చెబుతున్నయ్?

రంగ—ఇవీ ఏమో చెబుతాయిరా?–చిరిగి, విరిగినా.

రామ—ఆ–యీ రెండూ కలిసి చెప్పేదేమిటంటే, యీ సుంద రాంగి ఏ కారణంవల్లో. ఎవరితోనో పెనుగులాడిందనీ, ఆకొట్లాటలో యీ రిబ్బన్ చిరిగింది యీ పిన్ను విరిగిందీ అనీ.

రంగ—నీ తెలివితేటలకి నేను సంతోషించాను గాని ఇక వూరుకో. ఎవరన్నా వింటే చెప్పుచ్చుకు కొడతారు.

రామ—ఏమంటావ్?

రంగ—లేకపోతే ఏమిటిరా! అర్థరాత్రిపూట, ఏ ఆడది, ఎవరితో కొట్లాడుతుంది–వంటరిగా? ఏం ప్రపంచజ్ఞానం ఉండక్ఖర్లే.

రామం—నాకు ప్రపంచజ్ఞానం లేకపోయినా సరేగాని ఆమె ఏ జ్ఞానం లేకుండా దెబ్బలాడేసింది! ఆ మాట నిజం. నువ్వు నమ్మితీరాలి.

రంగ—పోనీలే. నువ్వు చిన్నబుచ్చుకోకు. నేను నమ్ముతాను. అయితేమాత్రం నువ్వు యింతా ఆలోచించి తేల్చేది "ఆమె ఎవరితోనో దెబ్బలాడింది" అని. అంతేగా?

రామం—అంతేనా? ఎందుకు దెబ్బలాడింది. దెబ్బలాట యేమయింది. ఎవరెట్లా గెలిచారు. ఇవన్నీ తేల్చాల్సిన విషయాలు?

[ఇంతలో ఒక యువకుడు వచ్చాడు. జుట్టు బాగా పెరిగి గిరజాలకు తక్కువగా ఉన్నది. సిల్కులాల్చీ గ్లాస్కో పంచ Rimless కళ్ళజోడు కాబూలీ shoes ఉన్నాయ్. లేనివి-మీసాలు]

యువ—Excuse me sir. I am sorry కాని ఒక్కవిషయం అడగాలని వచ్చాను. "కృష్ణవేణీ సరిత్తుంగ తరంగాలపై" అన్నారుగదా ఆ అన్నవాళ్లు ఆనకట్ట ఎగువవైపు చూసి అన్నారా, దిగువవైపు చూసి అన్నారా?

రంగ—దిగువవైపు.

రామం—ఏడిశావ్. ఎగువవైపు.

యువ—ఆ. ఎగువవైపే అయివుండాలి, సరే, వస్తా. (వెళ్ళాడు)

రంగ—ఈయన ఎవరు?

రామం—ఎవరో అవతలగదిలో ఆయన. ఎవరయితేనేం లే. మనసంగతి తేల్చు.

రంగ—మనసంగతీ? ఏదీ?

రామం—ఈ రిబ్బను, మల్లెపువ్వు.

రంగ—వాటి కొంప తెగిరి. ఆమె ఎవరో డెబ్బరాడితే మన కెందుకు లేద్దూ.

రామం—అలాఅనకు. ఆ నిరాశ నిరూపకుడికిఅసలుపనికిరాదు.

రంగ—నువ్వన్నట్లుగా ఎవరన్నా ఒక "అందమయిన" లేక "అందవిహీన" స్త్రీ, ఈగదిలోవుండి వెళ్ళివుండవచ్చు.

ఆమె ఏ కారణం వల్లనో ఎవరితోనో దెబ్బలాడి ఉండవచ్చు ఈ మాత్రం కనుక్కోవటానికి నీ తెలివితేటల్ని వృధా చెయ్యటమెందుకు?

రామం—ఒక దెబ్బలాట అయితే ఫరవాలేదు. కాని అదే యింకేదన్నా

రంగ—ఇంకేమన్నా, అవటానికి ఏముంది?

రామం—ఏమన్నా హత్యో! చోరీయో! ఏమో!

రంగ—ఏమో ఏదో ఒకటి. ఈ ప్రపంచంలో, యింతమంది పనిలేకుండా తిరుగుతుంటే అందరికీ అక్కర్లేనిది మన కెందుకూ?

రామం—మనబోటివాళ్ళు మన కెందుకని ఊరుకుంటుంటేనే యీహంతకులూ, దొంగలూ, రౌడీలూ యిట్లా విరగబడి పోతున్నారు.

రంగ—అయితే యిదేదో తేల్చి తీరాల్సిందేనా?

రామం—ఎంత శ్రమ కోర్చిఅయినాసరే.

రంగ—ఆఁ,

రామం—ఎంత ఖర్చయినాసరే.

రంగ—చెప్తేవినవ్?

రామం—చచ్చినాసరే.

రంగ—ఊఁ. నిన్నని ఏం ప్రయోజనంలే. తప్పంతా అనవసరంగా నీకు రెండువైపులా మెదడు పెట్టిన బ్రహ్మదేవుడిది.

రామం—నేను దీనికి పూనుకోడానికి అదే ప్రథమకారణం.

రంగ—ఏమిటి?

రామం—నామేథాశక్తిని ఇక అనవసరపు ఆలోచనలతో ఖర్చుచేయకుండా ఇటువంటి వాటిల్లో కల్పించుకుని-

రంగ—ఆ-కల్పించుకుని ?

రామం—పుణ్యాం, పురుషార్థం ... Name, Fame సంపాదిస్తాను.

రంగ—డబ్బుఅడక్కుండా !

రామం—అవసరమైతే సొంతడబ్బు ఖర్చుపెట్టి...

రంగ—మీా బాబాయిని మర్చిపోతున్నావ్ !

రామం—పోరా, ఇంతఖ్యాతి వస్తూంటే-ఇంకా బాబాయ్ అంటావ్.

రంగ—ఏడిశావ్ ! నేనుండగా నీకు రానిస్తావేం, ఖ్యాతి.

రామం—ఏంచేస్తావ్?

రంగ—నీ సంగతీ, నీసుందరాంగి సంగతీతేల్చేస్తాను.

రామం—ఈ బుర్రతోనే !

రంగ—ఆ-చూస్తూవుండు. అగో కుర్రాడా !

రామం—(ఇంతలో ఒకమూల ఏదోచూసి) ఆగు

రంగ—ఏం ?

రామం—అదేమిటో మెరుస్తోంది.

రంగ—ఎక్కడ ?

రామం—ఆమూల (ఇద్దరూ వెళ్ళి అదితీసి, చూస్తారు)

రామం—ఏదో రాయి.

రంగ—బాగా మెరుస్తోంది.

రామం—మంచి వజ్రంలాగవుం[redacted]

రంగ—అవును.

రామం—ఇది ఆమెదే అయివుండాలి.

రంగ—తప్పకుండా

రామం—అయితే తప్పకుండా ఆమె ఎవరో తెల్సుకోవాలి.

రంగ—ఎందుకూ!

రామం—ఇది ఆమె కివ్వొద్దూ?

[యువకుడు మళ్ళీవస్తాడు]

యువ—Excuse me sir, కాని ఒక్క సంగతి-ఏమండి "వజ్రకాయం" అనటంలో "కాయం"-అదే శరీరం-వజ్రంలాగా గట్టిగా ఉంటుందనా - వజ్రంలాగా మెరుస్తుందనా?

రామం—మెరుస్తుందనే?

యువ—You are corrct. వస్తా (వెళ్తాడు)

రంగ—ఒరేయ్!

రామం—ఏం?

రంగ—నీకేదో, కాస్త బుర్ర ఉండేది పూర్వం, గాని అది పోయిందిరా.

రామం—ఏం?

రంగ—"వజ్రకాయము" అంటే మెరుస్తుందనా?

రామం—ఏడిశావ్ శీనోయ్ - వాడికి చెప్పాలనే తప్పు చెప్పాను.

రంగ—ఆ!! (తెల్లబోతాడు)

రామం—వాడిసరుకెంతో కనుక్కుందామని.

రంగ—నిజంగా! (అని నోరు తెరుచుకొనిఆశ్చర్యంతో నిలబడి పోతాడు)

రామం—మంచినీళ్ళు కావాలా?

రంగ—ఆఁ!

రామం—Boy ని పిలవనా? మంచినీళ్ళు తెప్పిద్దాం.

రంగ—ఊఁ-

రామం—ఒరేకుర్రాడా—ఒరేయ్

[అని పిలవగా కుర్రవాడొచ్చాడు]

కుర్ర—ఏం సార్ - పిలిస్తిరి.

రామం—కాసిన్ని మంచినీళ్ళు పట్టుకురా(వాడు వెళ్ళబోగా)

రంగ—ఆగు. (కుర్రవాడు ఆగగా) ఈగదిలో, నిన్నరాత్రి, మేము రాకపూర్వం—ఎవరున్నారు?

కుర్ర—ఎన్నాతకిసార్?

రంగ—ఏదోఒక "అన్నాతకి". చెప్పు.

కుర్ర—రూంబు బాగా ఉండిందిలేదాసార్?

రంగ—రూమ్‌కేం! బాగానేవుంది.

కుర్ర—గాలి వరాదనా సార్?

రంగ—ఏడిశావ్. అడిగిందానికి చెప్పవోయ్?

కుర్ర— ఎందుకో చెప్పండిసార్ ?

రంగ—పనుంది. చచ్చేపనుంది. అసలుసంగతి చెప్పవేం !

కుర్ర—అండవనే!!! చచ్చేపనే ?

రంగ—ఆ-చచ్చేపనే! ప్రాణం ఎగిరిపోయేపని.

కుర్ర—కడవలే!!! (ఖంగారు పడ్డాడు)

దామం—(రంగంలో)అదిగాదురా. ఆగు (కుర్రతో)ఒరేయ్! నువ్విట్లారా.

కుర్ర—సార్-(దగ్గరకెళ్ళాడు)

రామం—ఈగదిలో మేమురాకముందు ఒకస్త్రీ - అంటే - ఆడది-ఉందిగదూ

కుర్ర—ఆమా సార్.

రామం—ఆమె 20-30 సం॥రాల మధ్య వయస్సులో ఉంటుందికదూ?

కుర్ర—ఆమా సార్.

రామం—ఆమె చూపులకి చాలా అందంగా చలాకీగా ఉంటుందిగదు ?

కుర్ర—నిజంసార్; రొంబ చలాకీ.

రామం—నిన్నరాత్రి, మల్లెపూవ్వులూ, నీలం రిబ్బనూ, పెట్టుకుంది కదూ ?

కుర్ర—ఉండిందిసార్; మల్లెపువ్వులు నేనే తెస్తిని.

రామం—ఇక చెప్పు. ఆమె వెంట్రుకలు పొడుగ్గా రింగులు తిరిగి ఉంట్లయ్ కదూ ?

# డిటెక్టివ్

కుర్ర—ఆసంగతి మీకెందుకు సార్ ?

రామం—ఎందుకయితేనేం చెప్పు. ఆ శిరోజాలు తుమ్మెద రెక్కల్లా నల్లగా, పొడుగ్గా, ఉంటయా ? లేదా ?

కుర్ర—ఉంటయ్ సార్.

రామం—ఆమె చేతి ఉంగరానికి పెద్దవజ్రంఉందా, లేదా ?

కుర్ర—(తెల్లబోయి) మీకెట్లా తెలుసును సార్!

రామం—తెలుసునులే. చెప్పు.

కుర్ర—ఆమె మీకు తెలుసునా సార్ ?

రామం—తెలిసునులే చెప్పు. చేతి ఉంగరానికి పెద్ద వజ్రం ఉందా లేదా ?

కుర్ర—ఉండింది సార్ కాని దాని సంగతి నాకేమీ తెలియదు సార్.

రామం—వజ్రం సంగతా ?

కుర్ర—అవునా సార్.

రామం—ఆవజ్రం పోయిందా ?

కుర్ర—అయితే పోలేదా సార్.

రామం—లేదు, పోలేదు. దాన్ని ఎవడో దొంగిలించాడు.

కుర్ర—అదే సత్యం; సార్.

రామం—ఒక డెవడో—నిన్న రాత్రి గదిలోకి వచ్చి అది కొట్టేసి వెళ్ళి ఉండాలి.

కుర్ర—రాత్రి నేనూ వింటినిసార్. గదిలోపల ఏదో గలాటా జరిగింది, ఒక గంటసేపు.

రామం—చూశావురా! రంగనాథం.
రంగ—ఆ-కనిపిస్తూనేవుంది.
రామం—ఆగలాటా అంతా ఏమంటావ్?
రంగ—ఏమననూ?
రామం—దీని సంగతి తేలిపోయింది - రాత్రి ఈ గదిలో
జరిగింది "చోరీ"
కుర్ర—చోరీయేసార్ - చోరీయే.
రామం—ఆమె ఇక్కడుండగా, ఎవడోవచ్చి ఆ నగలన్నీ
దోచుకున్నాడు.
కుర్ర—'ఎల్లాం' దోచుకున్నాడు సార్-ఒక్క King తప్ప.
రామం—ఆరింగులో రాయితప్ప, ఉంగరం కూడా తీసు
కెళ్ళాడు.
కుర్ర—కాదుసార్. ఉంగరం సర్కిల్ Inspector తీసుక
పూడ్చాడు.
రంగ—సర్కిల్ ఇనస్పెక్టరా-!!!
కుర్ర—అవునూసార్- రాయిదొరకలేదు. ఉంగరం దొరికింది.
రామం—అహా!
కుర్ర—ఉంగరం చేతికి బిగుసుకుపోయింది. ఉంగరంలో రాయి
మాత్రం కనిపించలేదు.
రామం—అదీసంగతి - ఆరాయి గలాటాలో ఊడిపోయు
టుంది. దొంగ ఉంగరంరాక వదిలేసి పోయాడు.
కుర్ర—వాడువూరికే వదలలేదుసార్- లాగటానికి ప్రయత్నం
చేసి విడిచాడు. ఆమెచేతికిగాయం అయివుండింగి.. అది
బాగా బిగిసిపూడ్చి రాకుండాపోయింది సార్.

రామం—ఉంగరం వ్రేలికి బిగుతుగా వుంది కాబోలు.

కుఱ్ర—అవునా సార్.

రంగ—పాపం ఆమెకు బాగా దెబ్బలు తగిలాయ్ కాబోలు.

కుఱ్ర—వేరేం దెబ్బ లేదుసార్. వేలికి ఒకగాయం. మెడ కాయ మాత్రం నలిగి, బాగా వాచి ఉండింది.

రామం—మెడ కాయ గట్టిగా పిసికాడు కాబోలు.

కుఱ్ర— మరి పిసక లేదా సార్. గట్టిగా పిసికి విడిచినాడు.

రంగ—అంతగట్టిగా పిసికితే ప్రాణంపోదూ?

కుఱ్ర—మరి పోదూసార్.

రంగ
రామం } అయి తేపోయిందా ?

కుఱ్ర—అప్పుడే పోయిందిగాసార్!
ప్రొద్దునే Report చెప్పితిమి. పోలీసులువచ్చి మమ్మల్నందర్ని దుంప తేంచాశారు.

ఇద్దరు—అహా!

కుఱ్ర—ఇంతవరకూ దొంగ దొరక నేలేదుసార్, ప్రాపర్టీ కూడా దొరక నేలేదట.

ఇద్దరూ—ఊ

కుఱ్ర—ఒక్క Clue కూడా దొరక లేదట సార్!

ఇద్దరూ—ఆ!

కుఱ్ర—ఆరాయికోసం వెతికాడుసార్.

యిద్దరు—ఊ

కుఱ్ర—అది దొరికితే దొంగ దొరికినట్టేట సార్.

యిద్దరు—అహా
కుర్ర—దానికోసం పెద్ద Investigarion చేస్తుండిరి.
యిద్దరు—ఓహా!
కుర్ర—ఊరంతా ఉదయంనుంచీ పెద్దగోలగా ఉండింది.
రంగ—అలాగా!!!
కుర్ర—అవునుసార్-మీారు C. I. D. తాలూకాసార్.
రామం—ఊ
కుర్ర—అహా కాదు.
కుర్ర—మరి ఎందు కడిగారుసార్ యివన్నీ?
రామం—ఏవి?
కుర్ర—ఈ మల్లెపూలూ అవీగురించి.
రామం—అడిగితే ఏం?
కుర్ర—ఏంలేదుసార్ C. I. D. పూరాwork చేస్తుండిరి. అందుకుదా అడిగితిని.
యువ—[ప్రవేశించి] Excuse me Sir ఒక్క-మాట. వజ్రాలసంగతి మీాకు బాగా తెలుసునట్లుఉంది. వజ్రాలకి వైడూర్యాలకి భేదం ఏమిటి?
రామం—అట్టేభేదం ఏముందీ-శాస్త్ర మెరుపులో తేడా అంతే!
యువ—అంతేనా? అయితే వజ్రంబదులు వైడూర్యంవాడ వచ్చునన్నమాటే.
రామం—ఆ

యువ—సరే-వస్తానండి (వెళతాడు)

రంగ—వీడెవడ్రా?

రామం—అవతల Room లో వాడు

కుఱ్ఱ— ఆమాం సార్-అవతల రూమ్‌లో ప్రొద్దున్నే దిగారు. నేనువస్తానుసార్,

రంగ—ఊ- పో

కుఱ్ఱ—(వెళ్ళబోయినవాడు తిరిగివచ్చి రామంతో) ఆయా ముంలో ఆయనమీకు తెలుసునాసార్?

రామం—తెలియదు-ఏం?

కుఱ్ఱ—తెలియకపోతే సరెసార్. ఏంలేదు. C. I. D. ఏమో నని (వెళతాడు)

రామం— }
రంగ } (ఒక్క-సారిగా ఒకళ్ళనొకళ్ళు చూసుకుంటారు)

రామం—ఏమిట్రా?

రంగ—వీడు C. I. D. యా?

రామం—(అనుమానంగా) C. I. D. ఏ అంటావా?

రంగ—అంటావా ఏమిటి? వాడే అయిఉంటాడు.

రామం—C. I. D అంటే ఎలాఉంటాడు.

రంగ—వాడిలాగానే ఉంటాడేమో.

రామం—అయితే వీడు C. I. D. అయిఉంటాడంటావా?

రంగ—అయ్యో ఉంటాడు.

రామం—అయ్యో ఉంటాడు! పైగా వజ్రాలసంగతి అడుగు తున్నాడు.

రంగ—అవును, ఆవజ్రంకోసమే వీడు వెతుకుతున్నాడు.
ఆవజ్రంద్వారా దొంగల్ని పట్టుకోవాలని కాబోలు.
ఆవజ్రం మనదగ్గరేవుంది.

రామం—నాదగ్గిర !! (జేబు తడుముకుంటాడు)

రంగ—అదిమనదగ్గర ఉందని కనిపెట్టేశాడు-వీడు

రామం—అందుకనే కాబోలు "మీకు వజ్రాలసంగతి బాగ
తెల్సిల్లే ఉంది" అన్నాడు

రామం—ఏమోరా ! C. I. D. లు మారువేషాల్లోతిరుగు
తున్నారట.

రంగ—తిరుగుతారూ ?

రామం—ఆ పుస్తకంలో C. I. D. మారువేషంలో తిరుగాడు
మరి (కాస్తభయంగా)

రంగ—తిరిగాడూ (వణుకుతాడు)

రామం—వణుకుతావేంరా ?

రంగ—నాకేదో దడపుడుతుందిరా.

రామం - నిజంగానేనా ? నాకు నిజంగానే దడపుడుతోంది.

రంగ—నాచేతులు వణికి పోతున్నాయ్.

రామం—ఆవజ్రం నాజేబులోఉంది.

రంగ—నువ్వన్నానాకు ధైర్యం చెప్పవేరా ?

యువ—[ప్రవేశించి] Excuse me sir, కాని ఒక్క సంగతి.
స్త్రీ ధనాన్ని దొంగిలించినవాణ్ణి ఏమంటారూ ?.

రంగ—ఉత్త వెధవ అంటారు.

యువ—ప్రత్యేకంగా ఏదైనా మాటవుందా 'స్త్రీధనశోధకుడు' లాంటిది. కాస్త తెలిస్తే చెప్పండి.

రంగ—మాకేం తెలియదయ్యా-అసంగతి.

యువ—[రామంతో] మీరాకండి!

రామం—నాకసలు తెలియదండీ.

యువ—[నిరాశగా] పోనీలెండి-వస్తా [వెళతాడు]

రంగ—రామం ???

రామం—కనిపెట్టేశాడురా!

రంగ—వీడువజ్రంకోసమే వెతుకుతున్నాడు

రామం—అదిమన దగ్గర ఉందని కనిపెట్టాడు.

రంగ—ఇక పోలీసుల్ని తీసుకొచ్చి మనల్ని పట్టిస్తాడు.

రామం—మరిఏంచేద్దాం

రంగ—అదే-ఏం చేద్దాం.

రామం—ఈవజ్రం ఎక్కడన్నా పారేసేద్దాం. (అని కిటికీ లోంచి-తనదగ్గరున్న వజ్రం పారెయ్యబోతాడు)

రంగ—ఆగు; నీకాస్త బుర్ర ఉందని ఒప్పుకొంటాగాని అది అవసరమైన విషయాల్లో ఉపయోగించవ్.

రామం—ఏం?

రంగ—అదల్లా పారెయ్యటం ఎవరన్నా చూస్తే-

రామం—మరెట్లా?

రంగ—పొట్లంకట్టి దూరంగాపారెయ్యి.

రామం—ఆహా (అల్లాగే పారేశాడు)

రంగ—అమ్మయ్య

రామం—ఇహ ఫరవా లేదు ఎంతమంది C. I. D.లువచ్చినా ఫర్వా లేదు.

రంగ—హాయిగా నిద్దర పోవచ్చు. ఇక కాస్సేపు నిద్రపో-యిల్లాంటి పిచ్చి పనులు యిక చెయ్యకు. (కాఫీ కప్పులు తీసుకొని కుర్రాడు వస్తాడు)

కుర్ర—సార్ సార్ సార్-ఆయన సి. ఐ. డీ టండి-

రంగ— ఎవరన్నారు ?

కుర్ర—మావాళ్ళే అంటున్నారు.

రామం— అయితేఏం, మమ్మల్ని ఏం చేస్తాడు. ఏరా ?

రంగ— ఆహా మననేం చేస్తాడు-అవును.

కుర్ర—ఏమోనండీ-మా అందర్కీ నిండా భయంగావుంది. యారి మీద కొస్తుందో ? వాళ్ళకనుమానం తగిలితే ముందుగా చావగొడతారుసార్.

యిద్దరూ— ఆ-

కుర్ర—నేవస్తాసార్, (వెళతాడు)

రామం—పో (వాడు పోతూవుండగా యువకుడు ఎదురు వస్తాడు.)

యువ—Excuse me sir - కాని మీరు శకుంతల చదివారా?

రంగ — లేదండీ.

రామం—ఎందుకండీ.

యువ— కాస్త కావాలిటండి-దాంట్లో

రామం—దాంట్లోమున్నా చదవలేదండీ,

యువ—అరె...చదవలేదండీ.

రామం—లేదండీ.

యువ—(యువకుడు వెళ్ళబోయి-ఆగి) ఆ! మీరెవ్వరండీ?

రామం—ఈవ్వూరు కాదులెండి

యువ—అహా! ఎందుకొచ్చారిక్కడికి?

రంగ—ఊరికేనే.

రామం—అహా! ఒక Friend తో, పనుండివచ్చాం.

యువ—ఆ Friend యీహోటల్లో దిగాడా?

రంగ—కాదు. వాడు ఈ వ్వూరువాడే.

రామం—వాడు వ్వూళ్ళోలేడట. అందుకని మేము హోటల్లో దిగాల్సివచ్చింది.

రంగ—రెండురోజులు తర్వాతగాని రాడట; అందుకని యిక్కడ వున్నాం. ఇక్కడేవ్వుంటాం రెండురోజులదాకా,

రామం—కూర్చోండిసార్, మర్చిపోయాను

యువ—(కూర్చొని) ఆయనతో మీకు ఏంపని?

రంగ—ఆహా! పెద్దపనేం లేదులెండి-అయితే మీకేంపని లేదూఅవతల-?

యువ—లేదులెండి; రెండురోజులు ఉంటారా.

రామం—ఉంటాం–ఎక్కడికిపోము?

రంగ—ఎక్కడికిపోయినా మీకు తెలియకుండాపోము.

యువ—(ఏదోజ్ఞాపకం వచ్చి హఠాత్తుగాలేచి) వస్తాసార్; ఒక idea తట్టింది. (వెళతాడు)

రామం— చెప్పవ ! మన దగ్గిర భోగట్టాలాగటాన్కి-వచ్చాడు.

రంగ —ఏదో Idea తట్టింది-అంటాడేమిటి.

రామం—ఏడిశాడు.

రంగ—అల్లా అనకు వీడేదో ప్లాను వేస్తున్నట్లున్నాడు.

[కుర్రవాడు ప్రవేశించి]

కుర్ర—కిటికీలోంచి ఏదో పొట్లం పడేసాడు సాబ్-సూరావాడు చూచి నాకిచ్చినాడు. ఇదిగో (అని రామానికి పొట్లం యిస్తాడు)

ఇద్దరూ (తెల్లబోతారు)

రామం—(తెప్పరిల్లి పొట్లం తీసుకొని) అదా - రంగా నీకు పొట్లాంగట్టి జాగ్రత్తగా ఉంచాలిగాని యిలా పారేస్తావేంరా!

రంగ—నేనూ పారేశాను!!

రామం—ఇంద-జాగ్రత్తగా దాయి.

రంగ—వద్దు!!!

రామం—వద్దంటావేం వస్తువు జాగ్రత్తగా దాయటం నేర్చుకో ఇంద (అని జేబులో పడేస్తాడు)

కుర్ర—వస్తాసాబ్, అంతా గడబిడగావుంది (వెళతాడు)

రంగ—ఎల్లారా దీన్ని వదిలించుకోవడం.

రామం —దాందేముందిలే ఎల్లాగో అల్లా వదిలిద్దాం.

రంగ—అందుకేనాకు వళ్ళుమండేది. అది నెమ్మదిగా నా ముఖాన పారేసి-ఊరికే కబుర్లు చెబుతావ్

రామం—అంత విసుక్కుంటావేం రా?

రంగ—విసుగు కాదూ! ఇది నీ జేబులో వుంచుకు మాట్లాడూ, చూద్దాం-విసుగొస్తుందో లేదో?

రామం—నీ జేబులో వద్దు, నా జేబులో వద్దు. దాని సంగతి ఆలోచించేశాను.

రంగ—అప్పుడే?

రామం—మరేమనుకొన్నావ్! దీన్ని ఒక పార్సిల్ కట్టి పోస్టులో పంపించేద్దాం.

రంగ—ఎక్కడికి.

రామం—ఎక్కడికో-అక్కడికి, వెధవ ప్రశ్నలు వెయ్యక - ఆ! అగ్గిపెట్టియిలా యియ్యి (గబగబా అగ్గిపెట్టియివ్వగా వ్రజందాంట్లో పెట్టి) ఆకుర్రవాణ్ణి అడిగి కాస్త జిగురు పట్టుకురా (రంగనాధం జిగురు కోసం వెళతాడు. రామం పార్సిలు కడతాడు. రంగనాధం జిగురుతో, సుకురాగా అంటించి పార్సిల్ చేసి అడ్రస్ వ్రాసి కుర్రవాణ్ణి పిలుస్తాడు) (వాడు రాగా)

రామం—ఒరేయ్ ఇది పోస్టులో పడేసిరా (వాడు తీసుకెళతాడు) చూశావా. ఈమాత్రం దానికి పెద్ద బ్రహ్మాండం చేశావు.

(కుర్చీలో కూర్చుంటాడు)

రంగ—ఒప్పుకొన్నా మరా.

రామం—ఏమని?

రంగ—నీకు రెండుపైపులా బుర్రపనిచేస్తుందని.

రామం—ఆ; అల్లా ఒప్పుకో; ఇక యీ సి. ఐ. డి. గాళ్ళని రమ్మను చూస్తా. ఆ కాస్త నక్కపొడి యిట్లాపెట్టు.

రంగ—ఆ-(నక్కపొడి జేబులోంచి తీసిపెడ్తా) అయితే ఎవరి అడ్రసు వ్రాశావు?

రామం—ఇంతవరకు పుట్టని-ఇక పుట్టబోని వాడి అడ్రస్ వ్రాశా.

రంగ—అయితే ఫర్వాలేదు. చస్తేవాడికందదు.

యువ—(వస్తాడు) ఏమండీ! ఈసంగతి మీకు తెలుసా? నిన్న యీగదిలో ఎవరో చనిపోయారట.

ఇద్దరు—(తెల్లబోతారు)

రామం—ఏమంటాయూ?

యువ—ఎవరో ఈగదిలో నిన్న హత్య చెయ్యబడ్డారని విన్నాను.

రామం—ఆ (తడబడుతూ) ఆ అదీనేనూ విన్నాను.

యువ—ఆ సంగతేమన్నా తెలుసామీకు?

రామం—తెలియదు.

రంగ—తెలుసు.

రామం—(తెల్లబోయి) ఆ!!!

రంగ—ఆ! నిన్న రాత్రి-అప్పటికి మేమురాలేదు. ఒక స్త్రీ 20_30 ఏండ్ల మధ్యవయస్సు-అందమయినదీ-నల్లజుట్టు;

యువ—ఆ ఆ- .

రంగ—నీలం రిబ్బను-మల్లెపూలు-చేతికి పెద్దవజ్రంగల ఉంగరం పెట్టుకొని వున్నది.

రామం—(ఆమర్దాగా) రంగనాథం-

రంగ—క్రూరంగా- ఘోరంగా- అన్యాయంగా- ఈగదిలో హత్యచేయబడ్డది. నగలన్నీ అపహరించబడ్డాయి.

యువ—నిజంగానండీ-మీాకుబాగా తెలుసా.

రంగ—తెలుసు.

రామం—తెలుసుగాని - బాగా తెలియదండీ

యువ—తెలియక పోవట మేమిటండీ - అన్నిగుర్తులు చెబుతుంటే.

రంగ—బాగా తెలుసు - నాకంటె పీడికి బాగా తెలుసు

యువ—ముఖ్యంగా ఆ ఉంగరంలో రాయిసంగతి ఎవరికీ తెలియదు పోలీసులకుకూడా తెలియదట. మీారామెను గుర్తించగలరటండీ?

రామం—గుర్తించ లేమండీ! మేమామెను చూడందే?

యువ—చూడలేదంటా రేమండీ, యిన్నిగుర్తులు చెప్పి!

రామం—ఇవన్ని మాకు ఆకుర్రాడు చెప్పాడు. ఏరా! రంగనాథం ఆకుర్రాడు చెప్పలా?

రంగ—కుర్రవాడికంటెముందు నువ్వేచెప్పావ్. నువ్వుచెప్పని దల్లా ఒక్కటే-ఆమెను ఎవరో హత్యచేశారని.

యువ—వస్తానా-పోలీసులతో మాట్లాడాలి [వెళ్ళిపోగా]

రామం—ఆగు!

యువ—ఏమండీ?

రామం—మీ వేషాలేం మాదగ్గర సాగవ్.

యువ—ఏం వేషాలు?

రామం—మీరు మాదగ్గరనుంచి ఈ భోగట్టా అంతా లాగి మమ్మల్ని ఏదో చెయ్యాలని చూస్తున్నారు.

యువ—మిమ్మల్నా?

రామం—వినండి - మాకీ హాత్యతో ఏమీ సంబంధం లేదు.

యువ—ఆ!

రామం—అసలు హాత్య జరిగిందనే మాకు తెలియదు. ఆమె ఎవరో కూడా మాకు తెలియదు.

యువ—నాకు తెలుసు.

రామం—మేము ఈవూరు యివ్వాళ ప్రొద్దున్నే వచ్చాం.

యువ—అయితే?

రామం—మీ తెలివితక్కువ నిరూపకత్వంతో మా తెలివితక్కువ దద్దమ్మ వాగుడు నాధారం చేసుకొని మా మీద నింద మోపితే - ఎలా తప్పించుకోవాలో మాకు తెలుసు.

రంగ—ఎలారా?

రామం—మీరు మాచేత అదీయిదీ వాగించి, మా దగ్గర నుంచి అంతా తెలుసుకోవాలని చూస్తున్నారు.

రంగ—మేము మాకు తెల్సింది కాస్తా చెప్పనే చెప్పేశాం.

రామం—ఏడిశావ్ - నోరుముయ్యి, మీ అనుమానాలకి ఆధారం మాదగ్గర ఏమీదొరకదు. కాబట్టి మా దోవన మమ్మల్ని పోనిచ్చి మీదోవన మీరుపోతే.

రంగ—మూకీ చాలా సంతోషం

యువ—కానినాదోవన నేనలా పోను?

రామం—కళ్ళు తెరచుకునే పోండి.

యువ—నన్నింతో ప్రేమించిన నా ప్రియురాలిని యీ హోటలు మొహాన పెట్టి నా దోవన నేపోనా?

రామం—
రంగ—} ఏమంటారు!

యువ—నా ప్రియురాలు-నాఅర్థాంగి-నాకోసంకని పెట్టుకుని వున్న కోమలి...

రంగ—అదిసరే-అసలుసంగతి.

యువ—ఇంకేంసంగతి; ప్రాణాలు పోయినతర్వాత,

రామం—ఆమె మీకోసం వచ్చిందా?

యువ—నాకోసం కాకపోతే మరెవరికోసం. ఆమెయింకా రాలేదని నేకాచుకు కూర్చున్నా! ఊరికే కూర్చోలేక ఆమెమీద పద్యాలుకూడా వ్రాస్తున్నా.

రామం—మీయిద్దరూ కలిసిరాలే?

యువ—ఆమె ఏలూరునుంచి రావాలి, నేను గుంటూరునుంచి వస్తున్నా. ఇద్దరం కలిసి బందరు వెళ్ళాలి. ఇంకెక్కడి కెళ్తాం! ఇక నేవ్రాసిన పద్యాలన్నీ పంచెయ్యాను.

శుక్ర—(వస్తాడు) ఇవ్వాళ ఆదివారంగ హారా. పోస్టాఫీసు లేదు. ఇదిగో మీపార్సెల్. (యిచ్చి ... ం)

యువ—నే నచ్చేలోగా అంతా జరిగిపోయింది, ఎంతలో ఎంత పని అయింది, (కళ్ళనీళ్ళు తిరిగాయి. కాసేపు ఎవ్వరూ మాట్లాడరు) వస్తాసార్; పోలీసులతో మాట్లాడాలి (యువకుడు వెళతాడు)

రంగ—పాపం (కళ్ళనీళ్ళు తుడుచుకుంటాడు)

రామం—(భుజంమీద చేతులువేసి) విచారించకురా; ఏం చేస్తాం.

రంగ—ఏంజేస్తాం - యేమిట్రా నీబొంద. పెళ్ళాంపోయి వాడేడుస్తుంటే.

రామం—వాడిపెళ్ళాం సంగతి సరే-మనప్రాణాల సంగతి యేమిటి ?

రంగ—ఏం మనప్రాణాలకి ?

రామం—యీగదిలో మనంఉంటే మనప్రాణాలూ పోతాయి

రంగ—ఏం ? ఆహంతకుడు మళ్ళావస్తాడంటావా ?

రామం—వాడురాడు, కాని పోలీసులు వస్తారు.

రంగ—ఆఁ—

రామం—సి. ఐ. డి. లు వచ్చి మనల్ని పట్టించుకుపోతారు పోయి మనల్నేహంతకులని ఉరిదీస్తారు.

రంగ—నిజంగా ??

రామం—(విసుగ్గా) నిజంగా ! ఏమిటి, నిజంగా–

రంగ—అయితే నిజంగానే

రామం—ఆఁ-ఆఅమ్మాయి గుర్తులన్నీ చెప్పేశావ్. ఈ ఉంగరంలో రాయిసంగతి పోలీసులకికూడా తెలియదు. అదీ మననోటితో మనమేచెప్పాం.

రంగ — చెప్పాం.

రామం — పోలీసులు ఆ ఉంగరంలో రాయికోసమే వెతుకు తున్నారు.

రంగ — అవునట.

రామం — రాయి ఎవరిదగ్గర దొరుకుతే వాళ్ళే దొంగలని వాళ్ళ ఉద్దేశ్యం.

రంగ — అవును.

రామం — ఇక వీడెళ్ళి పోలీసుల్ని తేవటమే తరువాయి.

రంగ — అవున్రోయ్.

రామం — తెలిసీ తెలియనివాగుడంతావాగి, కొంపమీదకు తెచ్చావ్.

రంగ — నిజం చెప్పేస్తే గోల వదలిపోతుందనీ

రామం — అదంతా నేనేచూట్లాడేవాణ్ణిగా, బుర్ర లేకుండా నీ వెందుకూ - మధ్య?

రంగ — బుర్ర! నాబుర్రమీద నీకు ఊరికే అలుసు.

రామం — లేకపోతే ఏమిటి?

రంగ — నీకంటే కోపంగాని బుర్ర ఉందికదా అని, తిని కూర్చుని యీ డిటెక్టివ్ పనే తలపెట్టేవెందుకురా?

రామం — తల పెడితే వేం?

రంగ — ఏం ఏమిటి, సీతలకాయ నాతో చెప్పకుండా తలపెట్టి తలమీదకు తెచ్చావ్.

రాముం—అబ్బాయ్, తెచ్చాను. ఇప్పుడిది పుస్తముద్దని తల మీద పీతం వేసుక్కూర్చుంది. దింపటం ఎట్లాగో ఆలోచించు.

రంగ—ఏమాలోచించను ?

రామం—ఈ వజ్రం ఎల్లా వదిలించుకోవటం ? ఇది మన దగ్గిరఉంటే మనమీద అనుమానం మరింత హెచ్చు తుంది.

రంగ—(ఆలోచన అకస్మాత్తుగా) ఆ. నాకొకటి తట్టిందిరా

రామం—ఏడిశావ్ ; - నీకు తట్టటంకూడానా

రంగ—నిజంగారా ?

రామం—ఏమిటది.

రంగ—ఈ వజ్రాం చిన్నదే కొంటట్టే యిద నెమ్మదిగా నోట్లో వేసుకొని మింగి నీళ్ళు తాగెయ్యి - యిక ఎవ్వరూ కనుక్కోలేరు.

రామం—నిజమేరోయ్.

రంగ—చూశావా ? నాకు బుర్ర లేదన్నావ్.

రామం—కాని వజ్రం మింగితే ?

రంగ—మింగూ !

రామం—సినిమాల్లో చాలమంది వజ్రాలు మింగి చచ్చారు కాదురా ?

రంగ—చస్తే ?

రామం—మరి నేను మింగితే నాప్రాణంపోదూ.

రంగ—పోతేపోనిచ్చు.

రామం— పోతే మళ్ళీ యెట్లారా ?

రంగ—పోతే ఆతర్వాత చూసుకొందాం. ముందు పోలీసులు నుండి తప్పించుకొందాం పట్టు

రామం—ఆఁ—

రంగ—పైగా ఈ పోలీసులు పట్టుకుంటారు. విచారణచేసి ఉరిశిక్ష వేస్తారు. వెధవప్రాణం ఎట్లాపోతేనేం ?

రామం—అంతేనంటావా ? అంతేనంటావా ? (దూరంగా వెళ్ళి, ఆలోచించి) ఒరేయ్ యిట్లారా (రంగనాథం దగ్గరకు రాగా) చెయ్యిపట్టు (వజ్రం చేతిలో పెట్టి) నువ్వే నోట్లో వేసుకోరా.

రంగ—ఆఁ!

రామం—మంచినీళ్ళిస్తాను. మింగెయ్యి. ప్రాణస్నేహితులం మన ప్రాణాల్లో భేదం ఏమిటి.

రంగ—నన్నే వేసుకోమంటా—

రామం—నీకు మాత్రలుమింగటం కాస్త అలవాటు కాదూ అందుకని నిన్నే వేసుకోమంటున్నా, (యువకుడు హోటల్ ప్రొప్రయిటరు వస్తారు)

హో. ప్రొ—ఇవ్వాళ ప్రొద్దున్నే కాదండి వీళ్ళొచ్చింది.

యువ— ఎప్పుడొచ్చారో నాకు తెలియదుగానీ-ప్రొప్రైటర్ గారూ, గుర్తులన్నీ చెప్పారండి.

ప్రొ—ఏమండీ ఈవిషయం మీా కేమైనా తెలుసా ?

యువ—అన్నీ తెలుసండి-మర్డర్ వీళ్లు చేశారో- లేదో, కాని మర్డర్ చేసినవాణ్ణి వీళ్ళకు తప్పకుండా తెలిసి వుంటాడు.

యువ—ఇందాక-ఉంగరంలో వజ్రం సంగతి ఏదో అన్నారు కూడా.

పా—వజ్రం వీళ్ళ దగ్గర దొరికితే మన అనుమానం నిజమే అవుతుంది.

యువ—వజ్రంవీళ్ళదగ్గర వుందేమో వెతికి చూద్దామా?

పా—మనకెందుకు - పోలీసులరానివ్వండి. వాళ్ళే వెతుకుతారు.

యువ—అందాకా కాస్త కనిపెట్టివుందాం- వజ్రం పారేయ్యకుండా.

రామం—(నిట్టూర్చి) హూ రంగనాథం, యిందాక వక్క-పొడి అయిపోయిందా? వుందా?

రంగ—ఉంది కావాలా, (అని వక్క-పొడితోపాటు వజ్రం కూడా చేతిలో పెడ్తాడు. రామం నోట్లో వేసేసుకొంటాడు)

కుర్ర—(వచ్చి) పోలీసులు వచ్చారు సార్

ప్రొ—యిక్కడికే రమ్మను (కుర్రవాడు వెళ్ళగా రంగనాథంతో) వాళ్ళు వస్తున్నారు. సంగతి సందర్భాలన్నీ మీరే చెప్పండి వాళ్ళతో - లేనిపోని గొడవ మా నెత్తిన పడ్డది.

రంగ—లేసిపోనిగొడవే మానెత్తిన పడ్డది. రామం, ఏం చేద్దాంరా.

రామం—ఏం చేస్తాం - రానీ

రంగ—వక్కపొడి అంతా వేసుకొన్నావా ? యింకా మిగి ల్చావా ?

రామం - అంతా వేసుకున్నానే—కావాలా ?

రంగ—ఒద్దులే—

రామం—ఇందాక నేనిచ్చింది వేసుకోలే.

రంగ—వక్కపొడా - వేసుకొన్నా హారెరామ్ ! అనవస రంగా నెత్తిమీదకు తెచ్చావ్‌రా.

రామం—ఈయన ఆమెగారి ఇలాకా అని తెలిస్తే యీ పాటికి ఆ దొంగను పట్టేసేవాణ్ని.

పుత్ర—(వచ్చి ప్రొ॥ తో) మిమ్మల్ని రమ్మంటున్నారండి.

ప్రొ—నన్నా ! పద (హోటల్ ప్రొప్రైటర్ వెళతాడు)

రంగ—ఏమండోయ్ ! మేము యీచోరీ సంగతి ఏమీ ఎరగమండీ.

యువ—అది పోలీసులతో చెప్పండి (విసుగ్గా)

రంగ—మాకు వాళ్ళనుచూస్తే నేభయం. మమ్మల్ని వాళ్ళ కెందుకు అప్పజెబుతారు. కావాలంటేమీరే వెతుక్కోండి.

యువ—ఉండండి, ఇంత Tragedy లోనేనుంటే ననుబాధ పెడ్తారు.

రామం—అవును—కేవలం సొంతభార్యపోతే-అందులో యింత అనస్యాత్తుగా !

యువ—పోయిoది, నిండు ప్రాణం! నన్ను నీళ్ళపాలుజేసి—ఆమెమీాద విరహగీతాలు వ్రాశాను. ఇకవియోగగీతాలు వ్రాయాలి—యీా చేతుల్తోనే

రంగ—మీారు కవులా?

యువ—ఆఁ—ఆమె కోసమే కవిత్వం నేర్చుకొన్నా.

రంగ—అందుకనేహ—మాట మాట్లాడితే వచ్చి ప్రతిమాటకీ అర్థమడిగారు—యింందాక.

యువ—కృష్ణవేణీ సరిత్తుంగ తరంగాలలో మంగళస్నానం చేసి కనక దుర్గాదేవి దివ్యదర్శనం చేసుకొందామనుకున్నాను ఆమె మనోధనాన్నంతా నేనే అపహరించానుకొన్నా. స్త్రీ ధనాన్ని అపహరించిన గజదొంగగా నన్ను నేనే వర్ణించుకొన్నా. వజ్రవైఢూర్యాల్లాంటి విలువైన ప్రేమను కొల్లగొట్టాననుకున్నా. కాని యీా దొంగలు.....

రంగ—ఆ దొంగలం మేంకాదండీ బాబూ.

కుర్ర—(వచ్చి యువకునితో) మిమ్మల్నీ రమ్మంటున్నారండీ.

యువ—నన్నా! పద (వెళతాడు)

రంగ—ఆఁ, నీకడుపులో ఎల్లఉందిరా!

రామం—ఏం? బాగానేఉంది.

రంగ—బాగా నేవుంది!!

రామం—ఏం? నీకడుపులో బాగా లేదా?

రంగ—లేకేం; బాగానేవుంది. (కాస్తదూరంగా వెళ్ళినాలుగు వేళ్ళు చూపిస్తూ) ఇవి ఎన్ని వేళ్ళురా?

రామం—అదేమిటిరా అట్లాఅడిగావ్?

రంగ — ఏదో అడిగాను చెప్పరాదా? వెధవప్రశ్నలెందుకూ?

రాముం — నాలుగు వేళ్ళు.

రంగ — ఫర్వాలేదు (కిటికీపైపు చూపిస్తూ) ఆ దూరాన ఉన్న దేమిటి?

రామం — మేడ.

రంగ — దాని ప్రక్కగా — దూరాన

రామం — గాలిగోపురం!

రంగ — యస్. దానిపై ఉన్న శిఖరాలెన్ని?

రామం — ఎందుకురా?

రంగ — చెప్పకుండా ఎందుకంటావేం?

రామం — నాలుగనుకుంటా.

రంగ — ఆ. ఆ, సరిగా చెప్పు.

రామం — అయిదు

రంగ — ఫరవాలేదు.

రామం — ఎందుకురా యివన్నీ.

రంగ — దూరదృష్టి ఉందో-లేదో-అని

రామం — ఏడిశావ్ లే; కాని ఒక్కసంగతి చెప్పు. వజ్రాలు మింగితే వెంటనే ప్రాణంపోతుందా?

రంగ — వెంటనే కాదేమోగాని కాసేపట్లో పోతుంది.

రామం — ముందు కడుపులో నొప్పి, ఆయాసం, మతితప్పటం, యిల్లాంటివేమీరావూ?

రంగ — అవ్వేమీ సినిమాల్లో చూపించలేదుగా.

రామం—వస్తే ముందు కడుపు నొప్పిరావాలి. వజ్రం అరిగి రక్తంలో ప్రవేశించిన తర్వాత మతికూడాపోవచ్చు.

రంగ—నేనూ అదేఅనుకున్నా. అందుకని మనం కడుపు నొప్పిసంగతి కనిపెట్టి ఉండాలి.

రామం—మరే అది రానంతవరకూ ఫరవాలేదు.

రంగ—మరి నువ్వు కాస్త కనిపెట్టిఉండు.

రామం—ఓ, నీకేం ఫరవాలేదు. నేకనిపెట్టి ఉంటాలే.

రంగ—(Detective Novel ను చూపి) అన్యాయంగా ఈ నవల చదివి ప్రాణాలమీదికి తెచ్చావ్ కదరా!

రామం—అబ్బాయ్! అంతా అయిపోయింతర్వాత యిప్పుడు ఏంచేస్తాం? ఇక కాసేపు ఓపికపట్టు. అంతా తేలిపోతుంది

రంగ—ఈ వెళ్ళిన వెధవలు తిరిగి చావరే ఎంతసేపటికీ.

రామం—ఒరేయ్! నువ్వు చావులసంగతి ఎత్తక నా కసలే భయంగా ఉంది.

రంగ—సరేలే అదీనిజమే.

కుర్ర—(వస్తాడు) దొంగలు దొరికారుటసార్.

రంగ—దొంగా?

రామం—ఆ!! దొరికాడూ!

కుర్ర—అవునుసార్. పోలీసులు పట్టుకొచ్చారు.

రంగ—ఎల్లా దొరికాడు?

రామం—ఎక్కడ దొరికాడూ?

కుర్ర—అదేమోసార్. దొంగ ఒకడు కాడుటసార్. ఇద్దరుట. చాలా gentlemen లాగా కనిపిస్తారట. వీళ్ళు

మల్లే, పడుచు వాళ్ళేట. వాళ్ళదగ్గర పోయిన సొమ్ము దొరికిందట. ఆ రూమ్‌లో ఉన్నాయన - గుర్తుపడుతున్నాడు.

రంగ—నువ్వు చూశావా దొంగల్ని ?

రామం—వాళ్ళనీ తెచ్చారా యిక్కడికి ?

కుఱ్ర—ఏమోసార్ ! అంతా గదిలో కూర్చొని రహస్యమా ఆలోచిస్తుండిరి.

రామం—మరి యివన్నీ నీ కెవడు చెప్పాడూ ?

కుఱ్ర—మా వాళ్ళంతా అనుకుంటుండిరిసార్.

రామం—మరి, వాళ్ళు మాట్లాడేది నువ్వు వినలా ?

కుఱ్ర—విన లేదుసార్. నే నిక్కడనే ఉంటినిగా.

రామం—ఇక్కడ అంటే !

కుఱ్ర—మే కమీదేసార్ మెట్లదగ్గర. మిమ్మల్నెవర్నీ కిందికి పోకుండా చూడమని చెప్పి పూడ్చినారు ప్రొప్రైటర్.

రామం—ఎవర్నీ వెళ్ళనివ్వద్దని కాపలా పెట్టారా-నిన్ను ?

కుఱ్ర—అదేసార్! మీయిద్దర్నీ......వస్తాసార్ ... అన్నీ సరిగ్గా కనుక్కొస్తా (వెళతాడు)

రామం—వీడనేది మన్ని గురించేనా ఏమిటిరా ?

రంగ—ఇంకా అనుమానమా! చచ్చాంరా దేముడా-తర్వాత జడ్జిమెంట్లు, ఉరిశిక్షలూ సంగతెల్లా ఉన్నా విచారణయ్యే దాకా మనయిద్దర్కీ జైలుతప్పదు.

రామం—జైలైనా ఫర్వాలేదు ఎల్లానో అల్లా శిక్ష తప్పిం చుకోవచ్చు. మహామహా మర్డర్ కేస్‌లే కొట్టేస్తున్నారు. కాని వజ్రం మింగినప్రాణాన్ని ఎంత పెద్ద డాక్టరయినా కాపాడలేడు.

రంగ—అవునవును.

రామం— ఈమధ్య ఎవ్వరూ వజ్రాలుమింగి చావటంలేదు.

రంగ—మరేం చాలాఖరీదైనవికదూ. ఎవరుమింగిచస్తారు?

రామం—అందుకే యిప్పటి డాక్టర్లకు-వజ్రం మింగితే ఏ మివ్వాలో ఏం చెయ్యాలో ఏమీ తెలిసి ఉండదు.

రంగ—అయితేయిక ఖాళీయేనంటావా?

రామం—ఆ వెధవ ఉంగరంలో రెండు వజ్రాలుంటే బాగుం డేది. చెరి ఒకటి మింగేవాళ్ళం.

రంగ—అంత అదృష్టంకూడానా.

రామం—నువ్వుమరీ గాబరా పడకురా; ఈలోపుగా ఏదో ఒకటి చేద్దాం.

రంగ—ఇంకేంచెయ్యగలం?

రామం—మరేంలేదు. జీర్ణంకాకమునుపే పొట్ట ఆపరేషన్ చేసి వజ్రం తీసేస్తేసరి.

రంగ—నీకేం ధైర్యంరా. ఇంత ప్రమాదమైన పరిస్థితుల్లో కూడా అంత తేలిగ్గా మాట్లాడ్తావ్.

రామం— లేకపోతే నీకు మల్లే ఈ వెధవప్రాణాలకోసం గాభరా పడతా ననుకున్నావేమిటి?

శాస్త్రి—(వచ్చి) వాళ్లే నొంగలట సాగ్ జైల్లో పెట్టేశారట.

రంగ—అయితే పుస్తం బయట పడ్డామన్నమాట.

రామం—అన్నమాట; మరిసామ్ము సంగతి.

కుఱ్ఱ—సామ్మంతా దొరికిందటసార్.

రామం—దొరికేఉంటుంది - ఆ ఉంగరంలోరాయితప్ప.

కుఱ్ర--ఉంగరంలో రాయీ దొరికిందటసార్.

రామం—
రంగ— } ఏమన్నావ్!!

కుఱ్ఱ—ఉంగరంలో రాయి దొరికిందట.

రంగ—ఏడిశావ్. సరిగ్గా కనుక్కో.

కుఱ్ఱ—లేదుసార్! దొరికిందట (ఇద్దరూ తెల్లబోయారు) ఏమిసార్! అట్లా అయిపోయారు.

రంగ—ఏం లేదు పో.

కుఱ్ఱ—వస్తాసార్! కావాలంటే మీరు ఎక్కడికైనా వెళ్ళవచ్చు. (వెళ్ళాడు)

రామం—కడుపులో భద్రంగావున్నరాయి వాళ్ళకెట్లా దొరికిందిరా!

రంగ—అదే ఆశ్చర్యంగా వుంది.

రామం—నీకడుపు ఆపరేషన్ చేసి తీస్తేగాని రాదే ఆ రాయి

రంగ—నాకడుపెందుకూ ఆపరేషన్; నీకడుపే,

రామం—నాకడుపెందుకూ; నీకడుపే.

రంగ—నువ్వువజ్రం మింగితే నాకు ఆపరేషన్ ఎందుకూ!

రామం—వజ్రంనువ్వు మింగావుకాబట్టి నీకు ఆపరేషన్.

రం గ.—ఏడిపిస్తుంది నువ్వేగా మింగింది.

రామం—ఏడిపిస్తుంది- నువ్వేగా మింగేసింది.

రంగ—లేదురా ఇందాక నేను నీకిచ్చాను.

రామం—మింగమని నేనే నీకిచ్చాను.

రంగ—మళ్ళా తిరిగి నీకేయిచ్చా.

రామం—లేదురా ఆఖరికి నేనే నీకిచ్చాను.

రంగ—ఆఖరికి నేనేయిచ్చానురా, వక్కపొడితో పాటు.

రామం—వక్కపొడితో పాటు వజ్రం యిచ్చావా?

రంగ—ఆఁ-యిచ్చా; వక్కపొడి అనగడంలో నీఉద్దేశ్యం అదేననుకొని యిచ్చా అది నువ్వు నోట్లో వేసుకున్నావాయె.

రామం—నువ్వుచూశావా?

రంగ—ఆఁ-కళ్ళారా!

రామం—అయితే నేనే మింగానా?

రంగ—నువ్వే-నమిలి మింగావ్!

రామం—ఎంతపని చేశావురా!!

రంగ—ఆఁ-

రామం—వజ్రం నాకడుపులోనే వుందా?

రంగ—ముమ్మాటికీ

రామం—నిజంగానేనా?

రంగ—నీతో నేను అబద్ధం ఆడ్తానట్రా.

రామం—అయితే నిజంగానే.

రంగ—ఓ-చాలా నిజంగా.

రామం—అయితే ఆపరేషన్ నాపొట్టకే - నాపొట్ట నిలువు నాచీల్చి వజ్రం ఎక్కడుందో భూతద్దంతో వెదికి తియ్యాల్సిందే.

రంగ— అక్ఖర్లేదు తేలిగ్గానే దొరుకుతుంది శాస్త్ర చమత్కారం లేని డాక్టర్ని పిలిచి తేసరి పైగా వజ్రం మెరుస్తుందిగా - త్వరగానే కనిపిస్తుంది.

రామం—ఈనిండుప్రాణాన్ని నిలువునా కోయ్యాల్సిందే.

రంగ—ఫరవాలేదురా! వెధవ ప్రాణంకోసం అంత ఖంగారు పడ్తావేందుకూ?

రామం—ఇంత ప్రమాదంలో అంతిధైర్యంగా మాట్లాడతావురా.

రంగ— ఫరవా లేదురా. గాభరాపడకు.

రామం—తప్పకుండా నేనే మింగానంటావా? నీపొట్ట ఖాళీయేనా?

రంగ—ఆఁ-ఖాళీయే.ఉన్నదే ఒకటి. నువ్వు మింగావ్. రెండు లేవుగా?

రామం—అంత అదృష్టంకూడానా! ఒరేయ్! కడుపులో ఏదో నొప్పిగా ఉందిరా

రంగ—ఎక్కడ?

రామం—ఈమూల

రంగ—నిజంగా?

రామం—నిజంగావేంటిరా? ఎక్కువవుతోందికూడా.

రంగ—ఒక్కసారి యిటుచూడు (నాలుగువేళ్ళుచూపిస్తూ) యివెన్ని?

రామం—ఆగరా చస్తుంటే నొప్పితో!

రంగ—ఎక్కువయి పోతుందా?

రామం—ఏ డాక్టర్నయినా పిలిపించరా.

రంగ—పంపిస్తా ఇవెన్ని?

రామం—ఎన్నోకొన్ని పంపించరా బాబూ!

రంగ—(కుర్రవాణ్ణి పిలిచి- వాడురాగా) దగ్గరలో ఒకడాక్టరును పిలుచుకురా.

కుర్ర—ఎందుకండీ?

రంగ—మావాడికి కడుపులో నొప్పివచ్చింది.

కుర్ర—కాస్తసోడావుప్పు వేసుకోండిసార్! పోతుంది.

రంగ—పోదు. వెళ్ళు త్వరగా డాక్టర్ని-(కుర్రవాడు వెళతాడు)

రామం—రంగనాథం!

రంగ—ఏట్లావుందిరా?

రామం—నువ్వుకాస్త దూరంగానుంచో (వెళ్ళి నుంచోగా చూచి) నువ్వేనా అక్కడ నుంచుంది.

రంగ—నేనే. నన్నేగా నుంచోమన్నావ్?

రామం—ఏదో కళ్ళు మసకలుగా వున్నాయేరా!

రంగ—నిజంగా!!

రామం—వజ్రం అరిగిపోతేనుగదా ?

రంగ—అప్పుడే అరిగిపోతుందా ?

రామం—అరిగే ఉంటుంది. నా కజీర్ణం ఎప్పుడూ లేదు.

రంగ—అయితే అరిగి బుర్రకి పట్టిందంటావా ?

రామం—ఏమో! కళ్ళకి తెర వేసినట్టుంది.

రంగ—అయితే ఆపరేషన్ చేసి లాభం లేదా ఏం ?

రామం—ఏమంటావ్?

రంగ—వజ్రం కడుపులో ఉంటేగా ఆపరేషన్ చేసి తీసేది.

రామం—అవును.

రంగ—డాక్టరు వచ్చియిక లాభం ఏముంది?

రామం—లాభం లేదూ!

రంగ—అందులో ఈకాలపు డాక్టర్లకి వజ్రంమింగితే ఏం చెయ్యాలో కూడా తెలియదు.

రామం—తెలియదంటావా ?

రంగ—ఆఁ—ఈరోజుల్లో వజ్రాలు మింగి చచ్చేవాళ్ళేవ రుంటారు.

రామం—ఉండరూ?

రంగ – ఎవరుంటారు ? వజ్రాలు ఊరికే వస్తాయా !

రామం—ఎక్కడన్నా దొరికితే!

రంగ—ఎక్కడ దొరుకుతై. దొరకవ్. నువ్వు గాభరాపడక బుర్రకి వజ్రవిషం ఎల్లానో పట్టింది. కాస్సేపటికి మతి

తప్పుతుంది. నాతితప్పిన మాటనే కనుక్కున్నాప్పి ఎల్లాగో పోతుంది.

రామం—తర్వాత ప్రాణమే పోతుంది.

రంగ—ప్రాణం ఎల్లాగో పోతుంది-యివ్వాళ కాకపోతే రేపు.

రామం—అయితే ప్రాణం పోతుంటే చూస్తూఊరుకోవలసిందే.

రంగ—ఆఁ-అంతే.

రామం—పోతే ఎట్లారా ?

రంగ—అబ్బాయ్...ఆతర్వాతసంగతి చూసుకుందాంలే.

రామం—అరేఁ ఎవ్వరా వస్తున్నది.

రంగ—ఎవరూ ?

రామం—ఎవరోరా ?

రంగ—ఎక్కడ ?

రామం—అదేరా ! ఆకిటికీలో

రంగ—ఆఁ కిటికీలోనా!

రామం—ఆఁ నల్లగా...లావుగా

రంగ—చెప్పకురా బాబూ,

రామం—గమ్మత్తుగా ఉన్నాడ్రా.

రంగ—వద్దురా బాబూఅంటే - చెప్పకు - నాకున్న ధైర్యం కాస్తా పోవాలా ఏమిటి ?

రామం—అదిగో అడుగులచప్పుడు!

రంగ—అడుగుల చప్పుడా ? నాకేంవినిపించంలే...

రామం—నాకు వినిపిస్తున్నది.

[కుర్రవాడూ ఒక ఆయుర్వేద ఆచార్యులవారు వస్తారు. హోటల్ ప్రొప్రయిటర్ కూడావస్తాడు.]

ప్రొ—ఎవరికండీ కడుపులోనొప్పి?

రంగ—మావాడికండి...

[ఆచార్యులవారురాగానే సరాసరి రామం మంచం దగ్గరకు వెళ్ళినాడి చూడటం ప్రారంభిస్తాడు]

రంగ—మావాడండీ...

ఆచా—(ఆగమని సంజ్ఞచేస్తూ) హుష్...చాలా ప్రమాద స్థితిలో ఉన్నాడు.

రంగ—కని పెట్టేశారండి

ఆచా—హుష్...వాతంలో సన్నిపాతంచేరి చేతంలో కెక్కి-చేతిలో కనిపిస్తోంది.

రంగ—నిజమేనేమో! శాస్త్రి త్వరగా మందివ్వండి.

ఆచా—జ్వరం 102° పైగా 104° లోపుగానూవుంటుంది.

రంగ—వాడికి జ్వరం లేదండి.

ఆచా—హుష్...అబ్బాయ్! దగ్గు వస్తోందా?

రంగ—లేదండీ...

ఆచా—ఆయాసంగా వుందా నాయనా?

రామ—ఆయాసమా...లేదండి.

ఆచా—వస్తుంది ఇకముందరవస్తుంది, కడుపునొప్పి-?

రంగ—ఉందండీ.

ఆచా—ఉంటుంది. ఫరవాలేదు. నాదగ్గర వజ్రనాభ భస్మం వుంది.

రంగ—ఆ!

ఆచా—వజ్ర మరకత మాణిక్యాలు, శతపుటం వేసితీసి దాచి వుంచిన దివ్యౌషధంవుంది. అదియిస్తే యిట్టే-

రంగ—మీరసలు సంగతి కనిపెట్టలేనట్టుంది.

ఆచా—తొందరపడకమ్మా-నీది కాస్త పైత్యపుతత్వంలావుంది

రంగ—వాడు ఒక్క వజ్రం మింగి యిలా అయ్యాడు. మీరు మరకత మాణిక్యాలుగూడ యిస్తే యిక ఆశవుండదు.

ప్రొ—వజ్రం—మింగాడా?

కుర్ర—ఎక్కడిది?

రంగ—యిక్కడ దొరికింది, అది మాదగ్గర దొంకితే మేమే నేరం చేశాం అంటారని మింగేశాడు. వక్కపొడితోపాటు. అప్పటినుండి కడుపులో నొప్పి ప్రారంభంఅయింది.

ప్రొ—వజ్రం యిక్కడెక్కడ దొరికిందండి గోల. ఈవజ్రం యెక్కడిదో.

ఆచా—ఫరవాలేదునాయనా! వజ్రంఎందువల్లమింగినావచ్చిన నొప్పికి మళ్ళా వజ్రమే పడాలి. హోమ్యో సిద్ధాంతం నిజమైతే యిదికుదిరి తీరాలి.

రంగ—కాని అల్లోపతి సిద్ధాంతం నిజం అయితే నీవుచచ్చి తీరాలి.

రామం—ముందు మందివ్వండిరా? మధ్య నే చస్తున్నాను.

రంగ—అదే ఏ థియరీ ప్రకారం యివ్వాలా అని

ఆచా—చూడునాయనా! వజ్రంమింగి ఎంతసేపయింది?

రామం—ఓ అరగంటలోపు.

ఆచా—ఫరవాలేదు. ఒకగ్లాసు నీళ్లు తీసుకురా (రంగనాథం కూజాలో నీళ్ళు తీసుకురాగా తన సంచిలో నుండి ఒక సీసాతీసికొని మందు వాంట్లోవేసి యిస్తూ) యీపానకం తాగునాయనా!

రామం—(కాస్తతాగి) అబ్బ! చేదు.

రంగ—ఛా! పానకం చేదుట్రా?

ఆచా—అదే పంచతిక్త పానకం.

రంగ—అదిచేదా?

రామం—చేదు To the power of 5

ఆచా—తాగు నాయనా తాగు (తాగించి) అబ్బాయ్ కాస్త ఉప్పు పట్టుకురా?

కుర్ర—ఉప్పా?

ఆచా—ఉప్పు—ఉప్పు-బాగా మరికాస్త పట్టుకురా (అని దోసిడిపట్టి చూపిస్తాడు)

రామం—కడుపులో...తిప్పుతోంది

ఆచా—తిప్పాలి, తిప్పాలి ఇరుక్కున్న వజ్రం విడి పడాలంటే బాగా తిప్పాలి.

ప్రొ—ఆగదిలోకి పోదాంపదండి. (రంగనాథంతో) మీరు కాస్త పట్టుకోండి. (ఇద్దరం సహాయంచేస్తూ రామాన్ని

అవతలగదిలోకి తీసుకువెళతాడు) రెండవవైపునుంచి కుర్రాడు ఉప్పుతీసు కొస్తాడు. అది ఆచార్యులవారు కూజాలో కలుపుతాడు (గదిలోంచి రంగనాథంవచ్చి)

రంగ—వమనం అయిందండీ.

ఆచా—వజ్రం వచ్చిందా ?

రంగ—రాలా !

ఆచా—ఈకూజానీళ్ళు త్రాగమనండి

రంగ— ఇవన్నీనా ? (తీసికెళ్ళి యిచ్చివస్తాడు)

ఆచా— తాగాడా ?

రంగ—ఆ !

ఆచా —వజ్రం వచ్చిందా ?

రంగ —లేదు (కుర్రాడు మరోబిందెడు నీళ్ళతోవస్తాడు)

ఆచా—యివికూడా యిచ్చెయ్యండి

రంగ —ఇదేమిటి ? చంప దలుచుకున్నారా ఏం ?

ఆచా —ఆభయం మీకేమీ అక్కర్లే!

రంగ—ఆ భయం మాకు కాకపోతే మీకా!

ఆచా— చూడండి పైత్యకోశంలో యిరుక్కున్న వజ్రం విడి వడాలంటే యిదేకాదు - మరో బిందెడు కూడా యివ్వాలి.

రంగ — ఆఁ—(రంగనాథం ఒక బిందె తీసుకొని వెళ్ళగా కుర్రవాడు ఖాళీ బిందెతీసుకెళతాడు. ఆచార్యుల వారు ఒకఘాల ఫ్గోకనభడగా అదితీస్తాడు.)

రంగ—(తిరిగి వచ్చి)

ఆచా—ఏం వజ్రంవచ్చిందా ?

రంగ—రాలేదు.

ఆచా—ఆవజ్రం ఎంతది ?

రంగ—చాలాచిన్నదండి.

ఆచా—ఇంత వుంటుందా (అని చేతిలో వజ్రం చూపుతాడు)

రంగ—ఇంతవుంటుందా ఏమిటి ? ఇదే-వాడి కడుపులోది యిక్కడికి ఎట్లావచ్చింది ?

ఆచా—అయితే ఆయన మింగలేదన్నమాట వక్కపొడితో పాటు వేసుకున్నారన్నారుకదూ? అది కొరకపడక వుమ్మేసివుంటాడు.

రంగ—మరి కడుపులోనొప్పి- ఈ గల్లంతంతా ఏమిటి ?

ఆచా—అదంతా మింగాననుకున్న గాభరాలో వచ్చిం దయి వుండాలి.

రంగ—అంతేగాని నిజమైంది కాదంటారా ?

ఆచా—కాదనే అనాలి.

రంగ—మరి ఇందాకటినుంచి- పైత్యకోశంలో చిక్కుందన అన్నమాట అన్నీ దండుగ అన్నమాటలు.

ఆచా—దండుగఅనే అనాలి.

రంగ—మరి లవణమిశ్రిత పాత్రాదిక జనపాన జనిత చర్దులు?

ఆచా—అనవసరమనే అనాలి. కాని యీవజ్రం మీరుపట్టు కెళ్ళి ఆనీళ్ళలో పడేయ్యండి చూడకుండా తర్వాత వాంతితో పాటువచ్చిందని చూపించండి.

రంగ—ఏంఖంగారు చేశావురా రామం (లోపలికి వెళ తాడు వజ్రంతీసుకుని)

ఆచా—ఆ-(రామాన్ని ప్రొప్రైటర్, రంగనాథం తీసుకు వచ్చి కూర్చోపెడతారు. రామం కళ్ళు గుంటలు పడి పోయాయి)

[యువకుడు కూడా వస్తాడు]

రంగ—వజ్రం వచ్చేసిందండి.

ప్రొ—పోయిన సొమ్మంతా దొరికిందాండి ! (యువకునితో అంటాడు)

యువ—ద్దొరికింది వుంగరంలో రాయితప్ప.

ప్రొ—ఇదేమో చూడండి (వజ్రం యిస్తాడు)

యువ—(అది తీసుకుని ఇదే యిక్కడి కెట్లావచ్చింది.)

రంగ—మాఖర్మంచాలకవచ్చింది. (ఆ వజ్రంవం కేచూస్తూ యువకుడు కుర్చీలో, కూర్చొని తనభావాల్లో మునిగి పోతాడు)

రామం—కడుల్లో ఇకఏమీ లేనట్టేనా ?

ఆచా—ఏమీ వుండదు. ఉంటానికి వీలు లేదు.

రామం—అవగింజంత ఏమన్నా అరిగిందేమో చూశారా.

ఆచా—ఏమీ అరగ లేదు. కాస్తాకూస్తా అరిగినా, అరిగిన వజ్రంవంటబట్టి శరీరం వజ్రకాయం అవుతుంది. ఈ డోసు వకసారి తీసుకోండి.

రామం—వద్దుబాబూ. అది మళ్ళీవద్దు.

రంగ—అదివద్దుగాని మళ్ళీ యిటువంటి పనులు చేయకుండా దళతిక్త కషాయం వకడోసు యివ్వండి.

ఆచా—అల్లాగే మరి నాకు సెలవా

రామం—ఆ. ఆ. యీ 10 రూ॥ లూ తీసుకోండి సెలవు

ఆచా—భగవదార్పణం. సెలవు.

ప్రొ—పదండి. పోదాం యింకెందుకూ.

రంగ—ఇంకెందుకూ పదండి. మేమూ వెళతాము. లేరా రామం సామాను సర్దు.

రామం—ఊ! వెళ్ళదామా!

రంగ—ఆ లేకపోతే యింకా యిక్కడే వుందామా. పద పద తిని కూర్చోక అనవసరంగా హైరాన పెట్టావ్ ప్రొప్రైటర్ గారూ, మా బిల్ తయారు చెయ్యండి బాబూ.

ప్రొ—అల్లాగే రండి తయారుచేసి వుంచుతాను. (యువ కునితో) ఏమండోయ్ వస్తారా? మేం వెళుతున్నాం.

యువ—(స్మృతిలోకి వచ్చి Excuse me ఏమండీ వియో గంలో విరహంరావచ్చా?

రంగ—యోగం బాగుండక పోతే ఏదైనారావచ్చు (అం దరూ వెళతారు. రామం రంగనాథం సామానుసర్దు కుం టుండగా)

—: తెర :—

---

శ్రీ కొండపల్లి ముద్రాశాల, రాజమండ్రి.